# జానపద గేయాలు



సేకరణ - స్వర కల్పన

కళాప్రపూర్ణ

డా॥ ఎ. అనసూయ దేవి

ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమి

# జానపద గేయాలు

ఎన్ని వందలఏండ్ల అవధులూ,అగడ్తలూ దాటుకుని వచ్చాయో ఈ జానపద గేయాలు! ఎంత ప్రాణం ఉన్నదో వీటికి! ఆ ప్రాణంతో ఎటువంటి అందచందాలూ, అలంకరణలూ ఉన్నాయో వీటికి! వాస్తవిక జీవితానుభవాలూ, ఆ అనుభవాలు రేపిన ఆవేశాలూ, ఆ ఆవేశాలు ప్రేరేపించే భావనా, ఆ భావన కల్పించిన చిత్రాలూ, ఆ చిత్రాల్ని నిర్మించిన మాటలూ, ఆ మాటలు మళ్ళీ, మనుష్యులై మనయెదుట నవ్వడమూ, నాట్యం చేయడమూ, నిట్టూర్చడమూ, జీవితఖండాలను ప్రదర్శించడమూ- ఈ జానపదగేయాలకు ప్రజకులాగే జరామరణాలులేవు. ఎప్పుడో బయలుదేరి ఎక్కడికో పోతూఉన్న అఖండ ప్రజావాహినికి ఎక్కడికక్కడ, ఎప్పటికప్పుడు, నిండుతనమూ, జీవనమూ, ఇస్తూ, కదలిస్తూ, ఈ జానపద గీతాలనే ఉపనదులు ఉపకరిస్తూ వస్తున్నాయి. ఇవి సరళంగాఉంటూ సుందరంగా ఉంటాయి. వాస్తవికంగా ఉంటూ వైకుంఠానికి నిచ్చెనలేస్తాయి. అమాయికంగా ఉంటూ, మానవ ప్రకృతిలోనే, అచల శిఖరాలూ, అఖాతాలూ, అందుకుంటాయి. అచ్చంగా భూగర్భంలోంచి పొడుచుకుని వచ్చి మొలుచుకుపోయే చెట్లూ, చామలూ, లతలూ, పూతలూ వంటివి ఈ జానపద గేయాలు.

మన దేశంలోని అల్ప సంఖ్యాకులూ, నాగరకులూ, అయిన పట్టణవాసులకులాగే లక్షలాది గ్రామాలలో నివసించే జానపదులకు కూడా, ఒక విశిష్టమైన సంస్కృతి ఉంది. అదివాళ్ల నిరాడంబర జీవితాన్ని ప్రతి ఫలింపజేసే వాళ్ల జానపదగేయాల్లో ఉట్టి పడుతూంటుంది. దేశంలోని ప్రతిప్రాంతం వారికీ ఎన్నో జానపదగేయాలున్నాయికాని, బాహుళ్యంలోను ప్రశస్తిలోనూ, వివిధత్వములోను, అవేవీ తెలుగువారి జానపదగేయాలకు సాటేరావనీ, ఆ విశిష్టతకు కారణము తెలుగుభాషయొక్క తియ్యదనమే నని సుప్రసిద్ధ జానపద

పరిశోధకుడైన ప్రొఫెసర్ దేవేంద్ర సత్యార్థి తాను రచించిన "మీట్ మై పీపుల్" అనే గ్రంథంలో వ్రాశారు.

ఎందరు కవుల రచనలో, ఆ కవులు అస్తమించగానే కాలగర్భంలో కలిసిపోతుండగా, లెక్కలేకుండా పుట్టుకు వస్తూన్న ఈ జానపద గేయాలన్నీ చెక్కూ, చెదరూ, లేకుండా, నాటికీ నేటికీ, సజీవంగా ఉన్నాయంటే ఆశ్చర్యమే. ఆ పాటలకు వార్ధక్యం రాకుండా, నిత్య యౌవ్వనంగా మార్చిన కీర్తి కొంతవరకు ఆ పాటల సాహిత్యానికి దక్కినా, చాలవరకు ఆ పాటల సంగీతానికే దక్కుతుంది.

జానపద గేయాలన్నీ ఆ ప్రాంతీయ జానపద వ్యవస్థల నుంచి పాతాళ గంగలా పొంగిపొరలి వచ్చే అప్రయత్న ఆశుధారలే, బృంద రచనలే. వివిధ వృత్తుల్లో దినమంతా కష్టించి బ్రతికే జానపదుల నిత్య జీవిత సమస్యల రాపిడి వేడికి, సంగీత సాహిత్యాలు, ఏకకాలంలో, ఏకధారగా పుట్టుకుని వస్తాయి. అవి, అకల్మషులూ, నిరాడంబరులూ, అయిన గ్రామీయుల భావాలు, స్వభావాలు, ఆశలు, ఆశయాలు, ఏకమై ఉప్పొంగిన అయాచిత ఆశుధారే జానపదగేయము. ఈ గేయాలు నవరస భరితాలు.

ఆంధ్రులకు ఆశయాలూ, ఆవేశాలూ కూడా ఎక్కువేకదా, పండుగలకు పబ్బాలకూ, కష్టాలకు సుఖాలకు, జానపదుల హృదయ తంత్రులు ఇచ్చే స్పందన, వెంటనే సంగీతంతో పెనవేసుకుని పోయిన మాటలే జానపద గేయాలు. తెలుగునాటి జానపదులంతా తమ్ముతామే యెరుగని, తమ సాంస్కృతి ప్రతిబింబాన్ని చూసుకోడం చేతకాని, అదృశ్య వాగ్గేయకారులే అనిపిస్తుంది. మానవ జీవితంలోని వెలుగు, నీడలు; ప్రేమ; ద్వేషము; శాంతి, సమరము; సంరంభము; సంతాపము; యౌవ్వనము, వృద్ధాప్యము; – అన్నీ జానపద గేయాలకు కథా వస్తువులే. తెలుగునాటి జానపద తటాకంలోని ప్రతీ అలా, ఒక గేయంగా రూపొందుతూ వచ్చింది. తెలుగు వారి నిత్య జీవిత క్రమాన్ని అనుసరించే వారి జానపద గేయాల క్రమముకూడా ఏర్పడింది.

తెలుగువారి జానపద సంగీతానికి, శాస్త్రీయ, లలిత సంగీతాలతో పాటు ఒక గౌరవస్థానం, సభార్హత, వచ్చాయంటే, దానికి ముఖ్య కారకు రాలిని నేనని చెప్పుకోక తప్పదు. నా చిన్ననాటి నుంచీ జానపదగేయాలు సేకరించడం, పాడడం, నాకు సరదా. నేను పుట్టిన ఊరు తూర్పు గోదావరి జిల్లాకు చెందిన కాకినాడ. ఆ ఊరికి కాస్త పట్నవాసపు పోకడ పల్లెటూరి వాతావరణం ఉండేది. దాని ప్రతి బింబాన్ని నేను. నా చిన్నప్పుడు, మా మామయ్య కృష్ణశాస్త్రి ఊరైన పిఠాపురం వెళ్లాలంటే బస్సులు లేవు. రెండెడ్ల బండిలో వెళ్లేవాళ్లం. త్రోవలో పొలాల్లో పాడుకునే పాటలు, పిఠాపురంలో, పొన్నాడమంద బయల్లో సత్యభామ కట్టిన భామాకలాపం, రదోత్సవాలలో చెక్క భజనలూ, తప్పెటలూ, కోలాటాలూ తోలుబొమ్మలూ, వీధినాటకాలూ, మాఊరు ఉప్పుటేరుగట్టున పడవవాళ్లు పాడుకుంటూ పోయే పాటలు, ఇంటిప్రక్క ఆముదం ఫ్యాక్టరిలో పనివాళ్ల పాటలు, మా నూకాలమ్మ గుడివద్ద సంవత్సరాది సంబరంలో ఆడించే గరగలూ, సిరిబొమ్మా- ఇవన్నీ చూసి, ఉత్తేజితురాలు నయి, ఆపాటలను తుచ తప్పకుండా గ్రహించి, సేకరించి, నేర్చి, పాడేదాన్ని, చుట్టుప్రక్కల గ్రామాల్లో తీర్థాలూ, జాతరలూ, జరిగాయంటే, అక్కడికి నేను మా నాన్నగారితో వెళ్లడం, ఆ జానపద వినోదాలు చూసి, ఆ పాటల్ని సేకరించడం జరిగేది. ఆ అభిరుచే నాలో ఒక ఉద్యమంగా రూపొంది, జానపద రచనలను, వాటి సంగీతాన్ని సేకరించి, పొందుపరచి, ప్రచారంలోకి తేవడం నా జీవితాశయం అయింది. నాయీ ఆశయాన్నీ, అభిరుచినీ, పెంపొందించిన వారు జానపద సంగీత పితామహులు, కీ.శే. వల్లూరి జగన్నాథరావుగారు. కర్ణాటక, హిందూస్థాని, శాస్త్రీయ సంగీతాల్లో పాండిత్యం కలిగి, జానపద సంగీతంలోని మెళకువల్ని, మాధుర్యాన్నీ గ్రహించీ, నాకనుగ్రహించిన వారు. జానపద గేయాలకు నా గాత్రం బాగుంటుందని గుర్తించి, నాల్గవ ఏటనే నాచేత, ప్రఖ్యాత జానపద గేయం "అయ్యోకొయ్యోడ", ఇంకా ఎన్నో జానపద గేయాలు, గ్రామఫోను రికార్డులు ఇప్పించారు. వారికి నేనెంతో ఋణపడి ఉన్నాను.

నేను నేర్చి సాధనం చేసిన శాస్త్రీయ సంగీతం, నేను ముందంజవేసి సాధించిన లలిత సంగీతం, నేను శ్రమించి సేకరించిన జానపద సంగీతం ఈ మూడు నా దృష్టిలో, ఒకే సంగీతార్ణవంలో కలిసే మూడు జీవస్రవంతుల ని నా నమ్మకం. నా చిన్నప్పటి కచేరిలలో ఈ మూడింటికీ సమాన స్థాన మిచ్చి గౌరవించేదాన్ని.

శాస్త్రీయ సంగీతంలో లాగే, జానపద సంగీతంలో కూడా, ప్రతి రాగము సంపూర్ణంగా ఉండాలని మనం అనుకోకూడదు. జానపద సంగీతానికి ఏ శాస్త్ర గ్రంథాలూ ప్రమాణాలుకావు. వాళ్ళ హృదయాలే వాళ్ళకు ఆధారం. అందువల్ల అనుకోకుండా కొన్ని పాటలు పూర్తి రాగాల్లో దొర్లినా చాల వరకు వాళ్ళ పాటల్లో రాగచ్ఛాయలు మాత్రమే కనపడుతూ ఉంటాయి. అందుకే నా యీ పుస్తకంలో రాగం పేరుకాక, ఫలానా రాగస్వరాలు అని మాత్రమే వ్రాశాను. తరచుగా హనుమతోడి (8) వకుళాభరణం (14) మాయా మాళవ గౌళ (15), నటభైరవి (20), కీరవాణి (21), ఖరహరప్రియ (22), హరి కాంభోజి (28), ధీర శంకరాభరణం (29) ఈ మేళకర్తలకు చెందిన రాగాల్లోనో, రాగచ్ఛాయల్లోనో, జానపదుల పాటలు ఉంటూంటాయి. అవి వాళ్ళ మనస్తత్వాలకి ఎక్కువ సన్నిహితమైనవి అనిపిస్తుంది. ముఖ్యంగా, నాటకు రంజి, నవరోజు, యదుకుల కాంభోజి, రేగుప్తి, ఆనందభైరవి, ముఖారి, వాళ్ళకి అభిమానరాగాలా అనిపిస్తుంది.

అదే విధంగా, ఏ సంగీతానికైనా సరే అలంకారం గమకాలే. శాస్త్రీయ గాయకుల్లాగా జానపద గాయకులు, గమకాలను దశవిధాలుగా విభజించి, ప్రయత్న పూర్వకంగా వాటిని ప్రయోగించక పోవచ్చునుగాని, ఆ గమకాలన్నీ వారి సంగీతంలో అప్రయత్నంగా దొర్లుతూనే ఉంటాయి. జంటహాలు స్ఫురితం, కంపిత, హాదిపితం - లాంటి గమకాలన్నీ జానపద గేయాల్లో ఉండడనే చెప్పాలి. పాడే గాత్రాలకి గమకం అనేది ఉగ్గు పాలతో అలవడు తుంది.

35 సంవత్సరాల ముందే నేను తెలుగు దేశం వివిధ ప్రాంతాలు పర్యటించి పొందుపరచిన కొల్లలైన జానపద గేయాల్ని క్షుణ్ణంగా పరిశీలించి, ఏయే రాగచ్ఛాయలలో ఉన్నాయో, ఏ గమక ప్రయోగాలు చేశారో గుర్తించి, వారియాస, వారి భాష, పాడే పద్ధతి అలవర్చుకున్నాను. నాది ఒక విధమైన రిసెర్చి అనవచ్చు. నా యీ జ్ఞానాన్ని (Knowledge)పాడడంలో చూపించాను కాని, డిగ్రీలకి ఆశపడలేదు. అయితే 1977వ సంవత్సరంలో ఆంధ్రాయూనివర్సిటీ వారు లలిత, జానపద సంగీతాల్లో నేను చేసిన కృషిని గుర్తించి, నాకు "కళాప్రపూర్ణ" Honorary Doctarate ఇచ్చి గౌరవించారు. నేను సేకరించిన జానపదగేయ సమూహంలోనుంచి చాలా పాటలు నా చెల్లెలు వింజమూరి సీతాదేవికిచ్చి, ఆమె M. Litt కి సహకరించాను. ఈ పుస్తకంలో కొన్ని పాటలను మాత్రమే స్వరపరచి, సంగీతంలో ప్రవేశం ఉన్న వారందరూ పాడుకోవడానికి వీలుగా ఈ గ్రంథ రూపంగా మీకు అందజేస్తున్నాను.

ఈ ప్రచురణకు కారకులైన ఆంధ్ర ప్రభుత్వమువారికి, ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ వారికి, తొలిపలుకు వ్రాసిన సోదరుడు డా॥ బాలమురళికృష్ణకు, నన్ను గురించి నాలుగు మాటలు వ్రాసిన వోలేటి వెంకటేశ్వర్లు గారికి ప్రూఫ్‌లు చూసిపెట్టిన మంచాల సోదరులకు, ముఖచిత్రం వేసిన మా బుజ్జాయికీ నా కృతజ్ఞతలు.

అనసూయ దేవి.

# తొలి పలుకు

## "కళాప్రవీణ" "కళాప్రపూర్ణ", పద్మశ్రీ డా॥ బాలమురళీకృష్ణ

తొలి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమిని మూడు అకాడమిలుగా విభజించటంతో ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమి 1981 ఫిబ్రవరి 1 వ తేదీన ఏర్పాటు చేయబడింది. ఈ అకాడమి మొదటి గౌరవ అధ్యక్షులుగా ప్రభుత్వం నన్ను నియమించి సంగీతలోకానికి సేవచేసే భాగ్యాన్ని కలిగించింది.

సంగీతంలో ఉత్సవాలు నిర్వహించటం, ఆ కళ ప్రోత్సాహానికి సంబంధించిన శిక్షణాలయాలకు, సాంస్కృతిక సంస్థలకు, నిస్సహాయస్థితిలో గల వృద్ధకళాకారులకు ఆర్థిక సహాయం చేయటం, యువ విద్వాంసులకు ప్రోత్సాహక పథకాలను అమలు జరపటం, మరుగునపడిపోతున్న మన జానపద సంగీత రూపాల పునర్వికాసానికి కృషిచేయటం మున్నగు కార్యక్రమాలతోపాటు సంగీతరంగంలో పరిశోధనచేయించి గ్రంథాలుప్రచురించే కార్యక్రమాన్నికూడా ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమి చేపట్టింది. ఈ ప్రచురణల పథకం క్రింద ఇంతవరకు ఆచార్య శ్రీవోలేటి శ్రీరామమూర్తిగారు రచించిన "అష్టోత్తరశతరాగాంగాది వర్ణమాల'' ప్రచురించటం జరిగింది.

ఇప్పుడు శ్రీమతి ఎ. అనసూయదేవిగారిచే సేకరింపబడి స్వరపర్చ

బడిన ఈ "జానపదగేయాలు" ప్రచురించటం జరిగింది. ఇది మా అకాడమి యొక్క రెండవ ప్రచురణ.

కళాప్రపూర్ణ డా॥ శ్రీమతి అనసూయదేవి జానపదగేయాలను స్వర పరచి సంగీత అకాడమికి ఇచ్చి అకాడమిద్వారా ముద్రించటం ముదావహము. ఈ సంతోషమే నేను ఈ నాలుగు మాటలు వ్రాయుటకు కారణము.

అనసూయ అంటే అసూయలేనిది అని అర్థం. కాని అనసూయ అంటే చాలా మందికి అసూయ ఉంది.

అనసూయ, అంటే అసూయ లేనిది అని అర్థం. కాని, అనసూయ అంటే చాలా మందికి అసూయ వుంది. ఇతరులు పలువురు మనల్ని చూసి ఎప్పుడు అసూయ పడతారో, అప్పుడు మనం ప్రసిద్ధులమనీ, మనం అభివృద్ధి పొందుతున్నామనీ, అర్థం చేసుకోవాలి. ఎవరో అన్నట్టు జ్ఞాపకం. The jealousy and controvercy are the rails on wich the life train can safely travel and reach the destination"

డా॥ అనసూయను గురించి నాకంటే తెలిసినవారు, నాకన్న పెద్ద వారు అనేకులున్నారు. నాకు సుమారు 1939 నుంచి తెలుసును. ఆ కాలం లోనే, అంటే నాకు చాలా చిన్న వయస్సులోనే, నేనక్కడ పాట కచేరీలకు వెళ్ళినా, అనసూయ, సీత, పాటకచేరీలు వుండేవి. వీళ్ళు నాకు Seniors. ఆత్మీయులు. సోదరీమణులు.

శ్రీమతి అనసూయ గొప్పపండిత వంశంలో జన్మించారు. వీరి తండ్రి గారు పద్మశ్రీ వింజమూరి లక్ష్మీ నరసింహారావుగారు అద్భుతమైన ప్రతిభా శాలి, గొప్పకవి. వీరి నాటకాలు, పద్యాలు, పేరికవిత, దేశం నలుమూలల్లా వ్యాపించింది. వీరి తల్లిగారు వింజమూరి వెంకటరత్నమ్మగారు కూడ గొప్ప కవయిత్రి, విదుషీమణి. 'అనసూయ' అనే స్త్రీల మాస పత్రిక సంపాదకు

రాలు. అనసూయ అదృష్టం, ఆమె భర్త గిరిగారు, వారి ఆదరణ, ప్రోత్సాహం, అనసూయకు గర్వకారణం. అంతేకాక, తన కుమార్తె రత్నపాప శ్రీమతి రత్న అనిల్‌కుమార్ కూచిపూడి, భరతనాట్యాలలో, ప్రపంచ ఖ్యాతి గాంచిన నాట్యతార. అనసూయ పిల్లలందరూ కళాకారులే. పంచ రత్నాలు. వీటన్నింటికంటె తన సోదరి సీత-వీళ్ళ అన్యోన్యం, అవినాభావత్వం, ఆశ్చర్యంగా ఉంటుంది. ఎల్లప్పుడూ ఒక్కలా దుస్తులు ధరించే వీరిరువురిలో, ఎవరు అనసూయ, ఎవరు సీతో, చాలామందికి, చాలాకాలం వరకూ, తెలియదు. అటువంటి సోదరి సీత దొరకడం నిజంగా అనసూయ అదృష్టం అనాలి. అయితే, తను సంగీతం సమకూర్చిన లలితగీతాలన్నీ చెల్లెలికి నేర్పించి, తనతో కూడ పాడించి, సీత జానపద 'రిసెర్చి'కి తోడ్పడి తనంతటి దానిగా తయారుచేసిన అనసూయ వంటి సహృదయురాలైన అక్క దొరకడం సీత అదృష్టంకూడాను మరి.

డాక్టరు అనసూయాదేవి, జానపద సంగీతం, లలిత సంగీతాలకి చేసిన సేవ సువిదితం. జానపద సంగీతం అనాది, శాస్త్రీయ సంగీతానికి పునాది. నిష్కల్మషమైన హృదయంలోంచి, తానుగా ఉద్భవించింది జానపద సంగీతం దీనిని క్షుణ్ణంగా తెలుసుకుని పాడలేని వారు సంగీత విద్వాంసులు కాలేరు. జానపదగేయాలు పాడడానికి ఉండవలసిన కొన్ని లక్షణాలు అంటే సాహిత్య జ్ఞానం, యాస, సంగీతజ్ఞానం, - ఇవన్నీ సరైన పద్ధతిలో గుర్తించి పాడినప్పుడు, విన్నప్పుడు, మన హృదయాలు స్పందిస్తాయి. ఈ విషయాలు చక్కగా గుర్తించి అనసూయ ఎంతో రిసెర్చి చేశారు. ఈమె బి. ఎ. డిగ్రీ తీసుకుని, కర్ణాటక సంగీతంలో మంచి ప్రావీణ్యం సంపాదించారు. ఈమె గురువు సంగీత సామ్రాట్ మునుగంటి వెంకట్రావు పంతులుగారు. అనసూయ లలితగేయాలెన్నో సంగీతం కూర్చి పాడి లలిత సంగీతాన్ని ప్రచారంలోకి తెచ్చిన ప్రథములరాలు. సుప్రసిద్ధులైన ఎందరో కవుల గేయాలకి సంగీతం సమకూర్చి ప్రజలకందించారు. మేనమామ అయిన కృష్ణశాస్త్రి గారి కృష్ణపక్షం మొదలైన రచనలన్నీ శ్రీమతి అనసూయ శుక్లపక్షంలోకి తెచ్చారు.

వీరు హార్మోనియమ్ వాద్యంలో అందెవేసిన చేయి. నా ఎరకలో ఇంత బాగా వాయించగలిగిన ఆడువారిని నేనెరుగను.

ఆకాశవాణిలో, జానపద సంగీతాన్ని ప్రవేశపెట్టడానికి ముఖ్యకారకులు అనసూయ. జానపద సంగీతాన్ని కచేరీలలోకూడా పాడి దేశమంతటా ప్రచారం చేశారు. సుభాస్ చంద్రబోస్, రాజేంద్రప్రసాద్, జవర్‌లాల్ నెహ్రూ, లాల్‌బహదూర్‌శాస్త్రి, డా॥ రాధాకృష్ణన్, V. V. గిరి, శ్రీమతి ఇందిరాగాంధి మొదలైన సుప్రసిద్ధుల ఎదుట గానం చేసి సెబాష్ అనిపించుకున్నారు.

వీరు అనేకరకమైన బాధ్యతలు కూడా స్వీకరించారు. ఆలిండియా రేడియోలో ప్రయోక్తగా, కళాశాలల్లో సంగీతాధ్యాపకురాలిగా, ఆడిషన్‌బోర్డులో మెంబరుగా, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ మెంబరుగా, ఆంధ్ర యూనివర్శిటీలో బోర్డు ఆఫ్ స్టడీస్ మెంబరుగా, జానపద కళా విభాగానికి ఉపాధ్యక్షురాలిగా జానపద సంగీతానికి ఎనలేని సేవ చేశారు. జానపదాలు పాడుటలో ఈమెను మించిన వారు లేరు. అంతేకాదు, ఈమె కొన్ని సినీమాలకు సంగీతం సమకూర్చారు. సంసారం బాధ్యత వల్ల సినిమాను వృత్తిగా గ్రహించనప్పటికీ, ప్రతిభలో నేటి సంగీత దర్శకులెవరికీ ఈమె తీసి పోదని నా నమ్మకం. వీరి సంగీత దర్శకత్వంలో నేను చాలా పాటలు సినిమాలో పాడియున్నాను.

నాల్గు దశాబ్దులుగా కళకోసం జీవితాన్ని ధారపోసి, ముఖ్యంగా, జానపద సంగీతాభివృద్ధికి మాత్రమేకాక, జానపద సంగీతోద్ధరణకు కారకురాలిగా, నిర్విరామంగా కృషిచేస్తూ నేటికి వారి అనుభవాన్ని ఒక గ్రంథరూపంగా వెలువరించడం ఒక గొప్ప విశేషం. సంపూర్ణ రాగాల్లో ఉండే జానపదగేయాలు అరుదు. చాలా వరకు రాగచ్ఛాయల్లో ఉండేవే అధికంగా ఉంటాయి. అందుకనే, ప్రతీ పాటకు ముందు, ఆ పాట ఫలానా రాగపు స్వరాల్లో, ఫలానా తాళంలో ఉందని, అనసూయాదేవి రాగ, తాళ, విభజనచేసి, ఆ పాటకు

'నొటేషన్' వ్రాస్తూ వచ్చింది. ఈ కృషిశ్లాఘనీయం. జానపద సంగీతం స్వరబద్ధంగా ముద్రించి, ముందుతరాల వారికి లభింప చేయడం కన్న ముఖ్యమైన సేవ మరేముంది.

శ్రీమతి అనసూయ యొక్క ఔన్నత్యాన్ని గుర్తించి, ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' అనే గౌరవ డాక్టరేట్ పట్టం ఇవ్వడం ఎంతయూ సముచితం. ప్రశంసార్హం.

ఈ గ్రంథ ముద్రణలో మాకు తోడ్పడిన సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ మంచాళ జగన్నాథరావుగారికి, చక్కగా ముద్రించిన నాట్యకళ ప్రెస్ నిర్వాహకులకు మేము కృతజ్ఞులము.

ఇట్లు

**డా॥ మం. బాలమురళీకృష్ణ**

అధ్యక్షులు

ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమి

వోలేటి వెంకటేశ్వర్లు B.A.
ప్రొడ్యూసర్, కర్నాటక సంగీతం
ఆల్ఇండియా రేడియో—విజయవాడ

శ్రీమతి అనసూయాదేవి పేరు, పాట, విననివారు మన దేశంలో ఉండరు అంటే ఎంతమాత్రం అతిశయోక్తికాదు. వింజమూరి సోదరీమణులుగా పేరు పొందిన అనసూయ, సీతగారలు చెప్పుకోదగిన ఉత్తమ గాయనీమణులు. అనసూయాదేవిగారు గానం శాస్త్రీయ, లలిత, జానపద రీతుల్లో బాగా పండింది. రసజ్ఞుల మన్ననలు పొందింది.

ఎన్నో సంవత్సరాలు కృషిచేసి, తాము నేర్చుకొన్నవి, సేకరించినవి, సంగీతం కూర్చినవి, భావగీతాలను, జానపదగేయాలను, అనసూయాదేవిగారు స్వరపరచి పుస్తక రూపంలోకి తీసుకొని రావడం సంగీతలోకానికి శుభవార్త. ఈ సందర్భంలో మా ఉభయులకు, పూజ్యులు, గురువులు అయిన కీ. శే. శ్రీ మునుగంటి వెంకట్రావు పంతులుగారి ఆశీర్వాద బలంవల్ల ఈమెకృషి ఫలించి, రసజ్ఞుల మన్ననలను పొందాలని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు

27-11-80

వోలేటి వెంకటేశ్వర్లు

# విషయ సూచిక

## వినాయక ప్రార్థన


| | | పుట |
|---|---|---|
| 1. | గనపతయ్యా గనపతయ్యా | 1 |
| | **ప్రేమ పదాలు** | |
| 2. | కోయ్యోడుపదం | 2 |
| 3 | కోలాటంపాట | 8 |
| 4 | వయసుపొంగు | 10 |
| 5. | నన్నుజూసి నవ్వింది | 14 |
| 6 | సిరిసిరిమువ్వా | 16 |
| 7. | రెండెడ్లా బండిస్తా | 18 |
| 8. | కాకినాడ సెలగపప్పు | 20 |
| 9. | మాబావ వచ్చేడు | 23 |
| 10. | నీకూనీవారు లేరు | 24 |
| 11. | ఓచిన్నదానా | 26 |
| 12. | గుంటూరుచిన్నదాన | 28 |
| 13. | గూడూరుచిన్నదానా | 29 |
| 14. | పచ్చబొట్టు పొడిపించుకావా | 30 |
| 15. | ఈరమ్మోమ్మబుల్లిరమ్మా | 32 |
| 16. | అన్నాడే వస్తనన్నాడె | 33 |
| 17. | వస్తావంటెపిల్ల | 36 |
| 18. | కూలికొస్తావంటెపిల్ల | 39 |
| 19. | ఓలోలెఓలోలె | 40 |
| 20. | బండెనకబండికట్టి | 42 |
| 21. | సెంగావిసీరగట్టి | 45 |
| 22. | గిద్దలగిరి కొండలనడుమా | 47 |

| | | పుట |
|---|---|---|
| 23. | ర్యాలీగావులపాడు | 49 |
| 24. | చీరకట్టూకూని | 52 |
| 25. | కోసిందికోయ్‌తోటకూర | 55 |
| 26. | ఘల్లుఘల్లుమని చప్పుడేస్తోంది | 57 |
| 27. | ఏంపిల్లో సంకిరి బిం కిరిగున్నావు | 61 |
| 28. | నక్క లోళ్ళసిన్నదాన్ని | 63 |
| 29. | అంతేనాకుచాలు | 66 |
| 30. | కృష్ణుడు చెంచిత | 68 |
| 31. | నానేరాలుఎంచదే | 73 |
| 32. | ఎటులా నేనడుగవస్తినే | 78 |
| 33. | కొప్పులపువ్వులూ | 82 |
| 34. | పసిబాలోన్నెయమ్మ | 88 |
| 35. | గోదారోఁసిన్నది | 90 |
| 36. | సీమదానఖూషిదాన | 92 |
| 37. | కోటిరత్నము ముద్దుకోమలాంగి | 94 |

## విరహం పాటలు

| | | |
|---|---|---|
| 38. | ఓనందగిరి బంగారుమామ | 96 |
| 39. | ఏమొదిన ఏమొదిన | 98 |


విరహం పాటలు

## పండుగ పాటలు


| | | |
|---|---|---|
| 40. | బేత్రాయిసామిదేముడా | 100 |
| 41. | పాలామువికూతురు | 103 |
| 42. | గొబ్బియళ్లో చిక్కుడు పూసింది | 105 |
| 43. | గొబ్బితట్టుదామురారె | 107 |
| 44. | గొబ్బియళ్లొసకియావినవె | 110 |
| 45. | గొబ్బియళ్లో గొబ్బియని పాడరమ్మా | 111 |
| 46. | పోపోపోచెలి | 113 |
| 47. | దుక్కులుదుక్కులు | 115 |

| | | పుట |
|---|---|---|
| 48. | అమ్మమాయమ్మా | 117 |
| 49. | ఎంతటివాదోయ్ | 118 |
| 50. | శివశివమూర్తివి | 120 |
| 51. | దుంపదుంపపరెయెంటికాలు | 124 |
| 52. | బేసు మూనుకొట్టిచ్చి | 125 |
| 53. | వల్లారి బాబో | 127 |
| 54. | ఏడుకొండలవాడా | 129 |
| 55. | హోలీహోలీ రె | 131 |
| 56. | మదనకాముడో | 133 |


## వృత్తి పాటలు


| | | |
|---|---|---|
| 57. | రామనాశందనాలో | 134 |
| 58. | నోమీనమల్లాలు | 136 |
| 59. | ఓసందమామయలో | 138 |
| 60. | కడుపుసల్లానితల్లి | 410 |
| 61. | చిత్తచిత్త వానకురిసె | 141 |
| 62. | పంన్నెండుధాన్యాలు | 143 |
| 63. | ఒడినిండపస్పెసొక్క | 146 |
| 64. | నాట వేసీ వేసీ వేసీ | 148 |
| 65. | వానాగొట్టా దాయె | 149 |
| 66. | దిగెనమ్మబోడిగుట్ట | 151 |
| 67. | కొడుకంటుపుట్టాడు | 152 |
| 68 | ముగురన్నలతోడ | 154 |
| 69. | దాకెళ్లబియ్యం | 155 |
| 70. | మందులోళ్ళమండో | 157 |
| 71. | దిగుదిగునాగన్న | 158 |
| 72. | దిగుదిగుదిగునాగ | 161 |
| 73. | దిగు దిగు నాగన్న | 162 |

| | | పుట |
|---|---|---|
| 74. | నాచేరమ్మ నాచేరు | 164 |
| 75. | ఒయిబావల్లార తుమ్మెదా | 166 |
| 76. | ఏవూరు ఏపల్లె తుమ్మెదా | 169 |
| 77. | ఆగరపట్టింది ఎన్నెలా | 171 |

హాస్యపు పాటలు

| | | |
|---|---|---|
| 78. | కుట్టమ్మా గోపాలకుట్టమ్మా | 173 |
| 79. | దేవుడయ్యాదేవుడు | 175 |
| 80. | పొట్టేల్ని కన్నతల్లి | 176 |
| 81. | కాకరచెట్టు మేకలు మేసె | 178 |
| 82. | అకొండబోడీ | 180 |
| 83. | ఒకరికి చేతులిచ్చాన్ | 181 |
| 84. | పెళ్లి పెళ్లన్నాడు | 185 |

ఇతర పాటలు

| | | |
|---|---|---|
| 85. | పసలపూడి | 188 |
| 86. | దుడ్డుగట్టెత్తుకోని | 190 |
| 87. | బండీర పొగబ డీర | 193 |
| 88. | గాజులుగాజులయ్యో | 196 |
| 89. | తమలపాకులమీద | 191 |
| 90. | కొండొండోరి సెరువులకాడా | 201 |

— ఓమ్ —

# ఊరేదుప్పుల ప్రారంభం

## వినాయక ప్రార్థన

1. రి రి గ - గ గ రి - స స స రీ స | నీ, - ,, - ,, ||
గ న ప - త య్యా గ న ప త - | య్యా - ,, - ,, ||
రి రి గ - గా రి - సా స - రీ స | సా, - ,, - ,, - రీ మ ||
ఉం డ్రా - ళ్లు - నీ కు - పో తు | రా, - ,, - ,, - ఓ - ||
మ మ మ - గా రి - రీ మ - మ మ గ |
గ న ప త య్యా - మం ద కొ డి గ |
రీ మ - గా రి - సా, - ,, ||
ఉం డ - బో కు - రా, - ,, ||

2. గనపతయ్యా గనపతయ్యా
జమ్మిపత్రి పూజసేతురా
ఓ-గనపతయ్యా ముందెనీకు పూజసేతురా ॥

3. గనపతయ్యా గనపతయ్యా
మనసునిండ పూజసేతురా
ఓ-గనపతయ్యా మమ్ము ఎపుడు మరువబోకురా ॥

4 గనపతయ్యా గనపతయ్యా
ఊరిలోన ఊరేగించెదా
ఓ-గనపతయ్యా ఉయ్యాలల ఊపుతానురా ॥

5. గనపతయ్యా గనపతయ్యా
ఉండ్రాళ్ళు నీకు పోతురా
ఓ-గనపతయ్యా మమ్ముఎపుడు మరువబోకురా ॥

# ప్రేమపదాలు

## కొయ్యోడు పదం

### శంకరాభరణ స్వరాలు - ఆదితాళం

కొయ్యోడు సా రి - రి గా గా | రి గ రి | రి స సా ||
చుక్కల కోక | కట్టా | - కో - ని ||

సా రి గ గా గా | గ రి గ రి | రి స సా ||
చుట్టూ - గోటూ | రై - కా | తొడి గీ ||

రీ మా మా మ గ | రీ గా | రి స సా ||
బు జ్జా ను న్న గ | దువ్వా | కో - ని ||
బొట్టూ, కాటుక | పెటూ | కో - ని ||

సా స స రీ గా | రీ గ రి | రి స సా ||
నోటిలో సుట్టా | పెట్టూ - | కో - ని ||
గో - టు గా నే | న డ సు | కొం టూ ||
స క్కా ద న మే | సూ హ | కొం టూ ||

సా రి స స రి రి స | స రి గ | రి స సా ||
ఎ క్క డి కె - ల్లి వు | చి - ట్టెం | మ్మ ం టె ||

చిట్టెమ్మ సా రి గ గా గా | గ రి గ రి | రి స సా ||
పో తే - ర మ్మా | మె ర క ల | మీ ది కి ||

సా రి గ గా గ గ | రీ గా | రి గ మ గ ||
పు ల్ల ల కె ల్తి ను | కొ య్యో | డో - - - ||

రీ సా రి గ మ గ | రీ రీ | రీ రీ ||
ర - య్యో - - - | కొ య్యా | డ నే ||

నీ స స రీ రి రి | రీ గా | రి గ మ గ ||
పుల్లల కె ల్లను | కొ య్యో | డో - - - ||

రి స స రి గ రి రి స | సా సా | సా సా ||
ర - య్యో - - - కొ | య్యో డా | - - ||

నీ ని స | రీ రి మ | సా రి స - సా సా ||
క ర్ర - | చే తా - | ప ట్టూ - కో నీ ||
కి రు - | చె ప్పు లు | తొ డి గీ కో నీ ||

రీ రి మ మా మ గ | రీ గ మ గా - రి స సా
పా య ల మొ ల్లా - | డే సూ - - కో - నీ
కా యా - వం చ లు | క ట్టూ - - కో - నీ

ధా , ధ సా స ని | స ధ ధ స | సా స ని ||
వ క్క లా కూ - | తే - సూ - | కో - ని ||

ధా ధ స సా స ని | ధా ధ స | సా సా ||
చె క్కు - గా స రు | కే సూ - | కో నీ ||

సా రి స స రి రి స | సా రి గ | రి స సా ||
ఎ క్క డి కె - ల్లి వు | కొ య్యో - | డం చె ||

కొయ్యోడు సా రి గ గా గా | గ రి గ రి | రి స స స ||
పో తే - ర మ్మా | మె ర క ల | మీ - ది కి ||

సా రి గ గా గ గ | రీ గా | రి గ మ గ ||
పో గా కు కె ల్లె నె | చి ట్టె | మ్మి - - - ||

రి స రి గ మ గ రీ | రీ రీ | రీ రి స ||
ల - మ్మి - - - చి | ట్టె మ్మి | నే - ||

ని సా రి రీ రి రి | సా రీ | స రి గ రి ||
పొ గా కు కె త్తి నె | చి ట్టె | మ్మి - - - ||

స ని స రి గ రి రి స | సా సా | సా స ని ||
ల - మ్మి - - - - చి | ట్టె మ్మి | - మ న ||

ని సా రి రీ రి రి | సా రీ | స రి గ రి ||
మి ద్ద ర మొ క్కా డ | కె ల్తా | మే - - - ||

స ని స రి గ రి రి స | సా సా | సా సా ||
ల - మ్మి - - - చి | ట్టె మ్మి | - - ||

చిట్టెమ్మ

సా రి గ గా గ గ | రీ గ రి | రి స సా ||
చీ టి కి మా టి కి | చి ట్టెం | మ్మం టె ||

సా రి గ గా గ గ | రీ గ గ | రి గ మ గ ||
చీ పు రు దె బ్బ లు | తిం ట వు | రో - - - ||

రి స రి గ మ గ రీ | రీ రీ | రీ రి స ||
ర - య్యో - - - కో | య్యో డా | - ను వు ||

నీ స రి రీ రి రి | సా రి రి | స రి గ రి ||
చీ పు రు దె బ్బ లు | తిం ట వు | రో - - - ||

స ని స రి గ రి రి స | సా సా | సా సా ||
ర - య్యో - - - కో - | య్యో డా | - - ||

నీ ని స రీ రి మ | స రీ స | సా సా ||
చి ట్టె - మ్మ న్నా - | న డీ ధి | లో నూ ||

ని̣ ని̣ సా రి రి మ । రి స రి స । స స సా ॥
చి న బా బుం త డు । పె ద బా - । బుం త డు ॥
క ర ణా లుం త రు । కా - పూ - । లుం త రు ॥

సా రి గ గా గా । రి రి గ గ । రి గ మ గ ॥
చి ట్టె - మ్మా ని । పి ల వ కు । రో - - - ॥

రి స రి గ మా గ రీ । రీ రీ । రీ రి స ॥
ర - యో్యా - - - కొ । యో్యా డా । - నే - ॥

నీ̣ సా రీ రి రి । సా రి రి । స రి గ రి ॥
కుం దం నా యి డు । కూ తు ర్ని । రో - - - ॥

స ని̣ స రి గ రి రి స । సా సా । సా సా ॥
ర - యో్యా - - - కొ - । యో్యా డా । - - ॥

కొయో్యాడు అబో్బ అబో్బ అలాగునైతే
వచనం కురసా కురసా మొక్కల పీటా
కుందం నాయిడు కూతురి వా-

సా । సా రీ గా గా । రి రి గా । రి గ మ గ ॥
సే । మ జ్జ ప్ప య్యా । మ న వ । ణ్ణే - - - ॥

రి స రి గ మ గ గ రి । రీ రీ । రీ రీ ॥
ల - మ్మో - - - చి - । ట్టె మ్మో । - - ॥

స్ని న్ని స రీ రి గ । సా రి స । సా సా ॥
మా టి కి మా టి కి । కొ య్యో - । డం కె ॥

స స రీ గా గ గ - రి రి గ గ । రి గ మ గ ॥
మ డ మా తా పు లు కి న గ ల । వే - - - ॥

రి స స రి గ రి రి స । సా సా । ,, ,, ॥
ల - మ్మో - - - చి । ట్టె మ్మో । ,, ,, ॥

చిట్టెమ్మ పావల డబ్బులు పట్టూకూని
పాలకొండ బజారు కెళ్తె
*ద్దూనెక్కలు తెలియవురో రయ్యోకొయ్యోడ ॥
ఇచ్చరూపాయి పట్టూకోని
ఇజయ నగరం సంతాకె ళ్తె
ఈదులన్నీ తెలుసుసురో రయ్యోకొయ్యోడ ॥

స ద । ధా స స సా స ని । ధ ధ సా । సా స ధ ॥
ఆ - । ఇం కె న కా త ల । పె ం టా । - ఆ - ॥

పె ం టా ద గ్గ ర । గు డి సే । - ఆ - ॥
గు డి సే లో - నా । గు ం టా । - ఆ - ॥

సా రి రి గా గా | రీ గా | రి గ మ గ ||
గుంటకి నీకూ | తంటాల్ | రో - - - ||

రి స స రి గ రి రి స | సా సా | , , , , ||
ర - య్యో - - - కో | య్యో కా | ||

నీ ని స రీ రి గ | స రి రి స | సా సా ||
ఇచ్చిన రూపాయ్ | ఇచ్చినవు | గా వి ||

సా రి రి గా గా | రీ గా | రి గ మ గ ||
ఇంటికి తగ్గా | కోడల్ | రో - - - ||

రి స స రి గ రి రి స | సా సా | , , , , ||
ర - య్యో - - - కో - | య్యో డా | , , , , ||

పోయిన సొమ్మూ పోయింది కానీ
పోణకా యంటే కోడల్ రో
రయ్యో కొయ్యోడా ||
చిట్టె మొఱ్ఱచ్చిన ముహూర్త మేటో
దొడ్డిడావులు దొర్లెన్ రో
రయ్యో కొయ్యోడా ||

వల్లూరి జగన్నాధరావుగారితో కలిసి
నేనిచ్చిన మొదటి గ్రామఫోను రికార్డు
1932
సేకరణ - కాకినాడ

# కోలాటం పాట

## ఓ చిన్ని ముద్దుబాలా

### శంకరాభరణ స్వరాలు — ఆదితాళం

1. ధ పా ధ । ధ స స రి । మా , ప । ప ప ప ద ॥
ఓ చిన్ని । ముద్దు బా - । లా నా । మ ర ద ల ॥

ప పా ద । ప ప మ గ । రీ ,, । ,, స ని ॥
నీ చెంగు । విడువజా । లా । నీకు ॥

స రీ రి । రి రి రి రి । రి గా మ । గ రి స స రి ॥
పో చీల । గుళ్ల పేరు । దా చీ ఉ । ం చితిని - ॥

గ మ గా రి - స రి గ రి - సా ,, । ,, ,, ॥
పొందు - గో రితిచా - లా ,, । ,, ,, ॥

2. పిడకల గంపతోడా ఓ పిల్లా
పెండెంవోరి దిబ్బకాడా - నీ
నడకాహొయలు జాడ నాకళ్ళతోజూడ
పడకాజెయ్యక వీడా ॥

3. ఆదెన్న అరుగుమీదా - ఆనాడు
సోదంత చెపితిగాదా - ఆ
మాదిగి యెంకడికి నాకూ వచ్చిన తంట
మరిచిపోతె మాసిపోదా ॥

4. కన్నూ బొమ్మలతీరూ - ఆనడుమూ
సన్నాన నూగాడూ - నిను

కన్నాది యెవతో కాకినాడజనమూ
కళ్ళుకుట్టి పోయినారే ||

5) ఉంగరాల కురులరాశి - ఓభామా నీ
బొంగరాల చరులకేసి - నాకు
గంగిర్లు ఎత్తంగ చూచి చూడనట్లు
గాయుందు లేల దాచి ||

6) వాటామైన చోటనే - మనకూ
మాటాలు కలియగానే - ఆ
కోటిపల్లి తీర్ధము ఏటికాడ నీయెంట
కుక్కలాగ తిరుగుతానే ||

7) తుమ్మచెట్టు పూతజూసి - ఓ భామా
తుమ్మెదలు రెండుతేచె
కమ్మవిల్తుని యొక్కమ్మడి శరముల
కాగియుంటి నినుబాసి ||

-వల్లూరిజగన్నాధరావుగారితో
గ్రామఫోను రికార్డు ఇచ్చినపాట
1932

# వయసు పొంగు

## కీరవాణిస్వరాలు - త్రిశ్రం

ని స రి - రి స ని - ని స స - స ని ని ||
వ య సు పొ ం గు వ ం టి క - ల్లి ||

ని స రి - రి స ని ని స స - స స ధ ||
ప డు చు సో - య గా - లు దే ర ||

స ని స - రి గ రి - స రి స - సా స ||
మా - య దా రి రే యి ఎం డ ||
మా పి డ ల్ల సో కి మొగము ||

ని స రి - స స ని - ని స సా - స ని ||
ఝు ం - మ్మ న తి రి గీ నా - ||
కుం డ బ ట్టై డా యె నే ||
గు ం టా నా - - సో గ సూ నా ||

ని ని స రి గ రి స స స స రి ని ||
ని ద ర - ల్లి - సె డి పె నే - - ||

స రి స స ని ని ని స సా స ని ||
మ రి ది మీ - ద ను న సూ నా - ||

హరికాంభోజి స్వరాలు
స రి రి గ గా గ మ గ రి స స ||
ప స లే - ని ము సి లి మొ గు డు ||

స రి గ రి రి స స రి రీ రి స ||
ద శ మ - ళ్ళ న త డ పా ఆ - ||
కో - తి మొ గ ము నా - సై - తి కి ||
కొ డు కు ను గ న లే - క - - ||

కీరవాణి ధా ప సా ధ ధ ధ స స స ధ ||
స్వరాలు దో స కా రి ము సి బి మొ గు డు ||
మీ - సా ల్కి ర ం - గే - సి ||

స్ని స రీ రి రి గ రి రీ స ||
మో స గి ంచి న న్ను పె ళ్ళి ||

ని స రి రి స ని స్ని స సా ధ ||
చే సి కొ ని తె చ్చి నా నా ||

స ని స రి గ రి - స ని స రి గ రి ||
ను ం డ నే - - (ఆ) ణ్ణో ద ల నే - ||
(ఈ) ణ్ణో ల్ల నే (నా) ను ం డ నే ||

## చతురశ్రం

ఖరహరప్రియ ని ని సా స - ప స ని ధ -
స్వరాలు మ రి ది ని ఎ డ బా సి
న గ తె న్నొ తె చ్చి నా డు

ని స సా స - స స ని ధ ||
మా రా ము ళ్లు పె చ్చి నా డు ||
ఎ గా ది గా వే సి నా డు ||

## తాళం లేకుండా

కీరవాణి ని స సా రి - స స రీ , స - ని స రి - స రీ స
స్వరాలు ద స రా పండు గొ స్తే నూ - నా కు లే దా నీ -

స్ని స సా సా రి - స స్ని స సా
దం డ క డి యా లె ట్టా - డె

* నాగులలచయితీకి - నాకందమూనీ
నానుపేటకొన్నాడె

* సంక్రాంతికనుముకూ బంగారు పలక
నగ్రుచేయించాడె

## చతురశ్రం

| | |
|---|---|
| హరికాంభోజి | సా స , సా స స సా రి స ని ని నీ \|\| |
| స్వరాలు | కో రి , తె చ్చి న కొ త్తా - మ ను మూ \|\| |

సా రి స రీ మ గ సా రి స సా , , ||
కొ రు క్కు తిం టా - నం టా - డే , , ||

వాచీపోయి ని లేచి పోదునని
కాచుక తిరుగుత నంటాడే

## త్రిశ్రం

* ధా | సా స - సా స - సా ధ - ధా స ||
ఆ | సై త త డ క తో ను పొ త్తు ||

సా గ దిం క కా పు ర ము ||
జు ట్టు జు ట్టు ప ట్టు కో ని ||
తి ట్టు కు న్న మ పో్ప - - ||

ని | స సా - రీ రి - సా స - రీ రి ||
ఆ | తి ట్లు కో డం కా ళి పో ను ||

తాళం లేకుండా

సా రి గి రి గా మ గ రి స - సా రీ రి గ మ గ

కొ ట్టు కు న్న మే - - త ల్లి నూ క మ్మో - -

గ రి గ రి - రి స సా ||

త - ల్లి - నూ - క మ్మా ||

* ఇద్దారి మధ్యబడి
సుద్దులు చెప్పడపోప్పి - ఆ
సుద్దులన్ని గాలిపోను
గుద్దులు తిన్నాడే తల్లి
నూక మ్మో తల్లి నూకమ్మా ||

నేనిచ్చిన గ్రామఫోనురికార్డు పాట (1934)
సేకరణ - వల్లూరి జగన్నాధరావుగారి వద్ద
కాకినాడ

# నన్ను చూసి నవ్వింది

## హరికాంభోజి స్వరాలు - త్రిశ్రగతి

1) సా స | స రి గా మ గ రి స సా , స ||
న న్ను | సూ - సీ న - వ్విం ం దీ దే ||

రి ప పా మ మా , మ గ రి ||
శో ళ్ల చి న్న దీ న - న్ను ||

2) మెట్టా ఎట్టిందీ అహా
మేలు కళ్లదీ ||మెట్టా||

మా మ గా మ పా ప పా మ ||
స ట్టి సే త పు చ్చు కో ని ||

దా ద ద ని ద ద పా , ; ||
సా గె డు తు ం దీ - - - ||

దా ద దా ద - ప ద ప మా మ ||
మి ట్ట పి ల్ల లా - గ మిడి సి ||

గ గ మ ప ప మ - గా , రి రి స ||
మి డి సి ప ద్తు ం దీ న - న్ను ||చూసి||

3) కోక కట్టుకుంది - సె
వ్వాకు లెట్టుకుంది - కొ త్త
దాకలంబ లెట్టుకోని

2) తాళ్ళరేవు వోడమీదా
సిరి సిరి మువ్వా - బల్
తళుకు సీరలంపినానే
సిరి సిరి మువ్వా
అందినట్టు తెలపవేమే
సిరి సిరి మువ్వా - నా
అందగత్తెనీవు గావ
సిరి సిరి మువ్వా

3) అద్దాల మేడలోన
సిరి సిరి మువ్వా - నీతొ
సుద్దులాడ నోచనైతి
సిరి సిరి మువ్వా
కాని కాల మాటచేత
సిరి సిరి మువ్వా
కడకు నీకు దూరమైతి
సిరి సిరి మువ్వా ||

4) చల్లని వెన్నెలనాడు
సిరి సిరి మువ్వా - వేయి
కళ్ళ నిన్ను చూడాల
సిరి సిరి మువ్వా
తెల్లని దేహమువాడు
సిరి సిరి మువ్వా
ఎల్లసిరుల నివ్వాలి
సిరి సిరి మువ్వా ||

సేకరణ - కాకినాడ
1986

# సిరి సిరి మువ్వా

## శ్రీరాగం స్వరాలు - తిశ్రగతి

1) రి మ ప ప ప పా ప ప ప మ రీ ||
జో డు కొ య్యల వో డ మీ దా - - ||

; రి మ ప మ రీ రి స రి స ||
సి రి సి రి ము వ్వా - జో డి ||

ని ప రి రీ స ని స రి స స రి గ రి ||
పా వు రా - లం పి నా నే - - - ||

స రి రి స సా సా ; ; ||
సి రి సి రి ము వ్వా ; ; ||

సా రి గ గా గా గ గ రి గ మ గ ||
అం ది న దో అం ద లే దో - - - ||

రి గ మ గ రీ రీ , రి రి స ||
సి రి సి రి ము వ్వా నా - కు ||

ని స రి రి రి స ని స రి స - స రి గ రి ||
తి రు గు ట పా - రా - నే - దో - - -||

స రి రి స సా సా ; ; ||
సి రి స రి ము వ్వా ; ; ||

తక్కెడు తుందీ
నాకాసి చూస్తానె
నవ్వుకున్నాదీ ||నన్ను||

4) పల్లిచ్చినాను - ఓ
పాలిగిల్లినా - ఈత
ఎల్లిగా ఏట్రోరె
ఎల్లు ఎల్లు మన్నది
సల్లగ ముద్దెట్టుకుంటె
పల్లకున్నదీ ||నన్ను||

సేకరణ పిఠాపురం
మా మామయ్య కృష్ణశాస్త్రి వద్ద 1941

# రెండెడ్లా బండిస్తా

## శంకరాభరణ స్వరాలు - ఆదితాళం

ఆమె

సా సా సా , , | రి మ మా | మా , , ||
రెం డె డ్లా | బ ం డి | స్తా , , ||

గా గా గా , రి | రి రి | సా , , ||
పం డే నా - | చే ని | స్తా ||

నీ ని స రి గ రి , స | నీ సా | రి , గ ||
ఎం కు లు గా - - ణ్ణి | చం పా | రో - ||

గా గా గా , రి | రి స సా | సా , , ||
లం బా లో ళ్ల | ర మ దా | సా ||

అతడు

రెండెడ్లా బండొద్దూ
పండేనా స్తే నొద్దూ
ఎంకులగాణ్ణి జంపానే
డెంకాలోళ్ల యెంకమ్మా

ఆమె

నీ సాయా నా సాయా
గొజ్జంగీ పువు సాయా
పువుమీదా తేనీగా
పోకిరీ కరి సాయా
ఎంకులు గాణ్ణి జంపెయరో
లంబాలోళ్ల రమదాసా
ఎంకులుగాణ్ణి తరిమెయరో
లంబాలోళ్ళ రమదాసా ||

అతను గొజ్జంగి పూగుత్తీ
కూలేనే నేలొత్తీ
రాలీన రేకులపై
వాలాదే ఈగైనా
ఎంకులు గాణ్ణి జంపెయనే
డెంకాలోళ్ల యెంకమ్మో
ఎంకులుగాణ్ణి తరిమెయనే
డెంకాలోళ్ల యెంకమ్మో ||

ఆమె సుక్కల్లా లేడెనెకా
మచ్చల్లా సిందుగురా
పరుగెత్తీ పరుగెత్తీ
ఒరిగింది చిరులేదే
ఎంకులు గాణ్ణి ఆపెయరో
లంబాలోళ్ల రమదాసా
ఎంకులుగాణ్ణి జంపారో
లంబాలోళ్ల రమదాసా ||

అతడు సిందుగునూ జంపేనే
సిరుతొకటీ యెంటడితే
సిరుతానూ యేటాడే
కరిసాల్లా పులి ఉరికే
ఎంకులు గాణ్ణి జంపెయనూ
డెంకాలోళ్ల యెంకమ్మో
ఎంకులు గాణ్ణి తరిమెయనూ
డెంకాలోళ్ళ యెంకమ్మో

(అన్ని చరణాలూ మొదటి చరణం వలె పాడుకోవాలి)

సేకరణ- అడవి బాపిరాజువద్ద
బందరు (1936)

# కాకినాడ సెలగపప్పు

## శంకరాభరణ స్వరాలు - త్రిశ్రం

1) సా రి గ మ గ - స స రి గ మ గ ||
కా కి నా - డ - సె ల గ ప ప్పు ||

రి స రి స సా సా " " ||
సి రి సి రి ము వ్వా " " ||

ని ని స రి గ రి స ని స రి గ రి ||
అ మ ల పు ర ం ఆ - వు నె - య్యి ||

రి స రి స సా - సా " " ||
సి రి సి రి ము వ్వా " " ||

2) పెద్దాపురం మంచి బెల్లం
సిరి సిరి మువ్వా
బూరెలొండ మన్నాడె
సిరి సిరి మువ్వా
బూరెలన్ని వండానె
సిరి సిరి మువ్వా
ఉడికాయో లేవాని
సిరి సిరి మువ్వా - నే
బూరెలన్ని తిన్నానె
సిరి సిరిమువ్వా ||

తాళంలేకుండా

3 స స రి మ - మా మా మా
అపుడు - నా రా జో

గా మ గ రి స రి గా మ గ రి
ఓ - - - - - - - - - -

స రి - గా మ గ రి స రి స నీ
- - - - - - - - - -

స్రీ స రి రి - రి రి రి స -
న - న్నెంత - మెచ్చుకు -

స రి గా మ గ రి - స రి గా మ గ రి
న్నా - డే - - - - - - - - - - -

స రి గా మ గ రి రి స -
- - - - - -

స స స స సా సా
సి రి సి రి ము వ్వా ॥

నన్నెత్తి ముద్దులాడాడె
సిరి సిరి మువ్వా ॥

4 అటువంటి నారాజె
సిరి సిరి మువ్వా

22

రంగమెల్లి పోతూంటె
సిరి సిరి మువ్వా
నా పాణమెట్టగుంటాదీ
సిరి సిరిమువ్వా
నా గుండె కొట్టుకుంటాది
సిరి సిరి మువ్వా

సేకరణ - కాకినాడ
1942

# మాబావ వచ్చేడు

హరికాంభోజిస్వరాలు - ఝుంపెతాళం

సా రి మ మ || మా మా మ || గ మ గా రి - రీ ,,
మా బా - వ || వ చ్చే డు || ఒ యి సె ల్లె లా

ని స్రా రి || రి గ రీ స || నీ సా స || సా ,, ||
నే నె ల్లి || వ స్తా - ను || ఓయిసెల్లె || లా - ||

కొత్తసీరాలెన్నో ఒయిసెల్లెలా
కొబ్బరి బెల్లాము ఒయిసెల్లెలా ||
సీటి గుడ్డాలెన్నో ఒయిసెల్లెలా
పైటి పావడాలు ఒయి సెల్లెలా ||
పట్టనం నుంచీని ఒయి సెల్లెలా
పట్టుకొచ్చేడమ్మ ఒయిసెల్లెలా ||
మాబావ వచ్చేడు ఒయిసెల్లెలా
నేనెల్లివస్తాను ఒయిసెల్లెలా ||
నన్నుమరవాకండి ఒయిసెల్లులా
నామాడ మరవాకు ఒయిసెల్లులా ||
అమ్మమాటయిను ఒయిసెల్లులా
అయ్యమాటాయిను ఒయిసెల్లులా ||

సేకరణ - కాకినాడ
1942

# నీకూ నీవారు లేరు

## నఠభైరవిస్వరాలు - ఆదితాళం

1) సా , సా , సా | , రీ మ | పా పా ||
నీ కూ నీ | వా రు | లే రూ ||

మ ప మ ప ద ప మ ప | మ గ మ గ | రి స సా ||
నా - - కు - - నా - | - వా - రు | లే - రు ||

* స రి గ రి రి గ మ ప | మ గ రి స | స రి గ రి ||
ప టి ఒ డ్డు నా - - - | - ఇ - ల్లు | క డ ద ము ||

రి స సా ; పా | , మ ప మ | గ రి స ని ||
ప ద రా చల్ | మో హ న | ర ం గా - ||

* నీకు నాకూ జోడు కలసెను గదరా చల్ మోహనరంగ

2) మారుమల్లి తోటలోన
మంచినీళ్ళ బావికాడ
ఉంగరాలు మరచివస్తిని
గదరా చల్ మోహనరంగ ||

3) కంటికి కాటుకెట్టీ
కడవా సంకానబెట్టీ
కంటినీరు కడవనింపితి
గదరా చల్ మోహనరంగా ||

4) గట్టుదాటి పుట్టదాటి
ఘనమైన అడవిదాటి

అన్నిదాటి అడవి బడితిమి
గదరా చల్ మోహనరంగా ||

5\. నీకు నాకూ జోడు అయితే
మల్లెపూలా తెప్పగట్టి
తెప్పమీదా తేలిపోదము
పదరా చల్ మోహనరంగా ||

6\. అదిరా నీగుండెలదురా
మధురా వెన్నెలరేయి
నిదరాకూ రమ్మంటిని
కదరా చల్ మోహనరంగ ||

(వల్లూరి జగన్నాధరావుగారివద్ద సేకరించినది)
కాకినాడ 1936

# ఓ చిన్నదాన విడువనె చెంగు

## హరికాంభోజి స్వరాలు - ఆదితాళం

ధ సా రి గ ప గ రి | స రి రి గ | రి స సా ||
ఓ చి న్న దా - దా - | వి డు వ నె | చె ం గు ||
ఓ చి న్న దా నా | వ ద ల నె | కొ ం గు ||

1) , గ గ రి - రి స సా స | గా గా, రి | స రి ప సా స |
, గుం టూ రు చిన్నదాన | గు ళ్లా, పే | రూ ల దా న ||

స రి మ మ మ మ మ మ |
గు డ్డ - పే రు ల మీ ద |

గ గ మ గా , రి | స రి గ మ గా ||
క ళ్లూ - - పా | తే - దే - - ||

స రి గ గా రి గ మ గ |
ఓ చి న్న దా నా - - - |

రి సా స | సా స స ||
ఓ చి న్న | దా - న ||

(మొదటి చరణం లాగ పాడాలి)

2) బంగారు చిన్న దాన
బాజాబందూల దాన
బాజాబందూలమీద
మోజేల లేదే || ఓ చిన్నదానా - - ||

3) కాకినాడ సిన్నదాన
కాసూల్ కంచేలదాన
కాసూల్ కంచేల మీద
మనసేల లేదే || ఓ సిన్నదాన - - ||

4) అద్దారూపాయపెట్టి
అద్దాల రైక కొంటె
అద్దాల రైకమీద
బుద్దేలలేదే
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ||

5. నల్లానల్లానిదాన
నడుమూ సన్నానిదాన
తళుకూ సేపల మల్లె
కులుకూ సూపులదాన
నిన్ను సూసీ మనసు
నిలువకున్నదోలె
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ||

(వల్లూరి జగన్నాధరావుగారి వద్ద సేకరించినది)
కాకినాడ 1936

# హరికాంభోజి స్వరాలు - ఆదితాళం

గుంటూరు చిన్నదాన
గుబురూ కేశాలదాన
గుబురూ కేశాలమీద
గొబ్బిపూలు సోకే
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ॥

పువ్వాడ చిన్నదాన
పువ్వుల జడలదాన
పువ్వుల జడలమీద
మనసెంత నీకే
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ॥

రంగాము పోయి నేను
రంగైన రైక తెస్తె
రంగైన రైకమీద
మనసేల లేదే
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ॥

("గుంటూరు చిన్నదాన గుళ్ళా పేరూలదాన" వరుసలాగ)

# గూడూరు చిన్నదాన

## హరికాంభోజి స్వరాలు - ఆదితాళం

గూడూరు చిన్నదాన
గూడూరు గుట్టాలదాన
గూడూరు గుట్టాలమీద
గాజులుంటె సోకే
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ||

నీలి నీలాటిదాన
నిలువు సన్నాటిదాన
నీలి నీలాము మీద
నగలుంటె సోకే
ఓ చిన్నదానా
ఓ చిన్నదానా ||

సన్నా సన్నానిదాన
నున్నాని కురులదాన
నున్నాని కురులమీద
జాజి గుత్తి సోకే
ఓచిన్నదానా
ఓచిన్నదానా ||

("గుంటూరు చిన్నదాన గుళ్ళాపేరులదాన" పాటలాగ)

# పచ్చబొట్టు పొడిపించు బావా

## కీరవాణి (21 మేళకర్త) స్వరాలు - త్రిశ్రం

రి రి గా రి స స సా రి స ||
ప చ్చ బొ ట్టు పొ డి పి ం చు ||

ని ని : , , , , ని ని స ||
బా వా పా వ ల ||

రి రి రీ గ రి స స సా రి స ||
ప ర కి చ్చి - పొ డి పిం చు ||

ని సా స రీ ; ; ; ||
బా - వా - ; ; ; ||

### శంకరాభరణ స్వరాలు

రీ మా మ గ రీ రి గ సా ||
ఆ - ప న్న కొం డొ క టి ||

కొం డ మీ ద గు డి ఒ క టి ||
రా మ న్న బా ణా లు ||
హ ను మం తు వా లా లు ||
సీ త మ్మ పా దా లు ||

రి రి రీ గ రి స స సా రి స ||
చే తి మీ - ది పొ డి పి ం చు ||

ని సా స రీ ; ; ; ||
బా - వా - ; ; ; ||

# కీరవాణి స్వరాలు

రి మ గా రి రి రి గా స ||
కో మ టో - రిం టి కె ల్లి ||
కో బ్బరినూ నె రా సు కో ని ||
సా తె వా రిం టి కె ల్లి ||
కొ త్త చీర కట్టుకుంటె ||
అవుడుసూసుకో (వచనం)

, , రి గా రి రి స సా స ని ||
నా - నె బా . గుం టా నో ||

స రి రి గ గ రి రి స సా సా ||
నీ - వే - బా - గుం టా - వో ||

, , ని స స స సా స రి గ రి ||
ని బ ద్ది గ చె ప్పి వో - యి ||

సా రి రి స సా సా , , ||
క రెం క డి బా వా - ||

సేకరణ- కాకినాడ

# ఈరమ్మా బుల్లిరమ్మా

శంకరాభరణ స్వరాలు - మిశ్రం

స రి గ - మ గ రి స - సా స సా సా ||
ఈ ర మ్మో - బు - ల్లి ర మ్మో - ||

ధ స స స ధ ధ స - ధ ధ స - స ధ ధ స ||
ఈ ర ం మ్మ ం చే - ఈ ర మ్మ కా - దూ - ||
అ ద్ది రి వ - వ్వా - వ వ్వ రి వ - వ్వ - ||
అ త్త రు బు డ్డి అ టు కు ల పే - రు ||
స క్క ని సు క్క సు క్క కి రి క్క ||ఈర||

1) స స | స రి మ - మా మా - గ మ గ - రి ప సా ||
ఓ లె | రా - జ మం డ్రీ రె డ్డి - కొ డు కూ ||

స రి గ గా మ గ - స రి స రి గ మ గ రి
రై - క లి స్తా - న న్నా - డే - - - ||ఈర||

2) స స | స రి ప ప ప మా - గ మ గ - రి స స ని
ఓ లె | కా కి - నా - డా క ల క చే - రు -

ని స రి రీ రి స - ని స ని పా రి గ రి స
కా - సు లి స్తా - న న్నా - డే - - - - ||ఈర||

3) మండపేట మిద్దెకాడ
నిండు సొగసు చూసి మురిసి — రెండూ ఒకే మాదిరి
మెల్లో తీగా యెట్టాండే ||ఈరమ్మా||

సేకరణ బి. ఎ రామారావు వద్ద
1940

# అన్నాడె వస్తనన్నాడు

## ఖరహరప్రియ స్వరాలు - త్రిశ్రం

ప ద స స ని ని ద ద ప ప ద ప మ గ రి
అ న్నా - డే - వ - స్త - న - న్నా - - -
గ రి రి గ సా ||
డె నా - - ||

స రి ప మ గ రి రి గ స సా సా , ||
నే స్తము - వి డు వ లే న న్నా డే ||
మ మ స స మ మ స మ మా మ ప ప ||
వ స్తు వు తె డ తా - న న్నా డె ఎం తో ||
పా ద స ని ద - ప మ గా మ పా పా , ||
ము స్తా - బు - చే స్తా - న న్నా డే ||
||అన్నా డే||

## మాయామాళవగౌళ స్వరాలు

1 స గ రి స స రి స ని స్రీ స రి స రి స రి ||
ద స్తు మూ ట లు దె స్త న న్నా డే - - - - - ||
స మ మా మ గ మ గా రి స ని స రి - పా స ||
దో స్తి వి డు వా - - జా ల న న్నా - డే అం ||

2 2 2
మ మ మ మ గ మ ద మ మ మా మా , ||
త స్తు లే క మా - యే - న న్నా డే , ||

గ మా , ప ప మ ప ద  ద ప ప మ మ గ
మ స్తై న ప్రేమా - తొ మ తి బో - యి -

గ రి రి స సా ||
సంచ - రి ||

స రి , గ గ మ గా రి గ  స సా  సా , ||
స్తు న్నా న ని చెప్ప -  మ న్నా  డే ||

## హరి కాంభోజి స్వరాలు

2. స ద ద ద ద ద ద ద  దా ని ద ద ద ద పా ||
పు స్తై మొ గు డ ని చెప్ప  మ న్నా - డె వ ల పు ||

1 2 2 2 2 1
పా ద ని ద ప  మ మ మ ప  ప మ ప ద ని ద
వి స్తా - ర  మ ని చెప్ప మ - న్నా - - -

ద ప పా మ ||
డే - - అ ||

1 1
మ మ మా మ మ గ మ ద మ  మ మా  మా గ ||
వ స్త్ర మి క్కు ట మా - యే - న  న్నా  డే ఈ ||

గ మా , ప ప ప మ ప దా  ద ప ప మ మ గ
క స్త్రీ  లు ప డ లే - క  కా - స్త - ప్రా -

గ రి రి స సా ||

ణము విడి చి ||

స రీ , గ గ మ గా రి గ రి స సా సా , ||

చ స్తా - న ని చె ప్ప - మ - న్నా డే , ||

||అన్నాడే||

వల్లూరి జగన్నాధరావు గారి వద్ద సేకరించి

నేచిన్న గ్రామఫోను రికార్డు (1935)

# వస్త్రావం తెపిల్ల

## హరికాంభోజి స్వరాలు - త్రిశ్రం

అతడు స రి మ మ మ మ మా గ మ గ రీ రీ , ||
వ స్త్రా - వం తే పి ల్ల వ స్త్రా వం తే ||

స రి గ గ గా గ రి గా స సా , స స స ,, ||
కొ త్తా కో రం గి దా క వ స్త్రా వం తే ||

ఆమె స ద ద ద పా ప మ గ మ గ రి రీ , స సా ||
వ స్త్రా గ నీ - నే - వ స్త్రా గ నీ న న్ను ||

సా రి గా గ సా రి గా గ రి గ రీ స సా , ||
కొ ట్ట కుం డ తి ట్ట కుం డ ఉ ం టా వం ట్రా ||

అతను నే - కొట్టకుండ తిట్టకుండ ఉంటాన్గాని
నువ్వు - నవ్వకుండ తుళ్ళకుండ ఉంటావంతే

ఆమె నే - నవ్వకుండ తుళ్ళకుండ ఉంటాన్గానీ
నా - నవ్వులముద్దులమోము నవ్వులాత్తది

వచనం ఆ నవ్వులాడ్తదా
ఊఁ నవ్వులాడ్తదీ

అతను నీ - నవ్వుల ముద్దూల మోము నవ్వులాడైనూ
నా - చేతినున్న చింతబెత్తం చీరాడ్తదీ

వచనం — ఆ చీరా డ్తదా
ఊ చీ రా డ్తదీ

ఆమె — నీ - చేతనున్న చింతబెత్తం చీరా డ్తెనూ
నా - నోట్లోఉండె బండమాట బయటెల్లదా

అతను — నీ - నోట్లొ ఉండె బండమాట బయటెల్లితే
నా - కాళ్ళ ఉండె కిఱ్ఱుజోడు దవడా డ్తదీ

ఆమె — నీ - కాళ్ళ ఉండె కిఱ్ఱుజోడు దవడాడితే
నే - నమ్మగారింటికి దాడే స్తనూ

వచనం — ఆ దాడే స్తవా
ఊ దాడే స్తనూ

అతను — నువ్వమ్మగారింటికి దాడే స్తనూ
నే-కొట్టకుండ తిట్టకుండ తీసుకొ స్తనూ

వచనం — ఆ-తీసుకొ స్తవా
ఊ తీసుకొ స్తనూ

ఆమె — నువ్వు-కొట్టకుండ తిట్టకుండ తిసుకొ స్తనూ
నే-కూడొండకుండాను కూకుంటాను

అతను — నువ్వు-కూడొండకుండాను కూకుంటేనూ
నే-పొలమెల్లకుండాను తొంగుంటాను

వచనం — ఆ తొంగుంటావా
ఊ తొంగుంటానూ

ఆమె — నువ్వు-పొలమెల్లకుండాను తొంగుంటేనూ
బావిలొ ఉన్న గుంటలోన నే పడ్తనూ

అతను బావిలో ఉన్న గుంటలోన నువ్వు పడ్డైనా
వెట్టోణ్ని పిలిపించే యెత్తిస్తైనా

ఆమె ఆ ఎత్తిస్తవా
అతను ఊ ఎత్తిస్తనూ వచనం

ఆమె నువ్వు - యెట్టోణ్ని పిలిపించే యెత్తిస్తైనా
నే - దెయ్యమై, భూతమై నిన్ను పడ్తనూ

అతను ఆ నన్నుపడ్తవా
ఆమె ఊ నిన్నేపడ్తనూ వచనం

అతను నువ్వు - దయ్యమై భూతమై నన్నుపడ్తైనా
నే - భూతవైద్యుణ్ని పిలిపించి వదలగొడ్తనూ

ఆమె ఆ - వదలగొట్టవా
అతను ఊ - వదలగొట్టనూ వచనం

ఆమె నువ్వు - వైద్యుణ్ణి పిలిపించి వదలగొట్టైనా
నే - తిరుపతి కొండెక్కి తిరిగి చూడనా

అతను నువ్వు - తిరుపతి కొండెక్కి తిరిగి చూసితే
నే - బెంగపురి కొండెక్కి చిందొక్కనా ||

అడవి బాపిరాజు గారి వద్ద సేకరించినది (1938)

# "వస్తావం లేపిల్ల" లాగ

ఆతడు — కూలి కొస్తావంటే పిల్ల
వస్తావంటే

ఆమె — కూలంటె కులాస అయ్యామాకు

అతడు — వస్తావంటె నేత కొస్తావంటె

ఆమె — నేతంటె నేతేను అయ్యామాకు

ఆతడు — వస్తావంటే ఊడ్పు కొస్తావంటె

ఆమె — ఊడ్పంటె ఊగులాట అయ్యామాకు

అతడు — కోడతావంటే పత్రకోడతావంటె

ఆమె — పత్రంటె వళ్ళుమంట అయ్యానాకు

అతడు — వస్తావంటె కోతకొస్తావంటే

ఆమె — కోతంటె కోలాటం అయ్యామాకు

# వస్తావంటెపిల్ల వరుసలో పాడాలి

## హరికాంభోజిస్వరాలు - త్రిశ్రం

అతడు ఓలోలె ఓలోలె పిల్లానీవు
గోంగూర కోయగలవ పిల్లానీవు

ఆమె గోంగూరకోయలేను అయ్యాోనేను
గోళ్ళన్ని కందుతాయి అయ్యానాకు

అతడు ఓలోలె ఓలోలె పిల్లానీవు
ధాన్యమైన దంచకలవ పిల్లానీవు

ఆమె ధాన్యమైన దంచలేను అయ్యానేను
ధాన్యమంటె దగ్గుస్తదయ్యా నాకు

అతడు ఓలోలె ఓలోలె పిల్లానీవు
ఏకులైన వడకగలవ పిల్లానీవు

ఆమె ఏకులైన వడకలేను అయ్యానేను
ఏకులంటె ఏడుపొస్తదయ్యానాకు

అతడు ఓలోలె ఓలోలె పిల్లానీవు
ఎల్లైన ఎయ్యగలవ పిల్లా నీవు

ఆమె ఎల్లైన ఎయ్యలేను అయ్యానేను
ఎల్లంటె ఏటోను అయ్యానాకు

అతడు ఓలోలె ఓలోలె పిల్లానీవు
చాపైన ఎయ్యగలవ పిల్లానీవు

ఆమె చాపైన ఎయ్యతేను అయ్యానేను
చాపంటె చక్కడత అయ్యానాకు

అతడు ఓలోలె ఓలోలె పిల్లానీవు
సంతకైన ఎల్లగలవ పిల్లానీవు

ఆమె సంతంటె ఎల్ల గలను అయ్యానేను
సంతంటె సంతోషం అయ్యానాకు

# బండెనక బండికట్టి

## శంకరాభరణ స్వరాలు - త్రిశ్రం

1) , , ధ స సా | రి మ మ | మ మా |
బం డెన్క | బ ం డి | క ట్టి |

, , గ గా రి | రి స | స నీ |
ప ద హా రు | బ ళ్లు | క ట్టి |

, , స రి రి గ రి స | స ని ని | ని సా |
నీ - కే - డ | ఉ ం టి | వ యో |

, , రి గ గా రి | రి రి స | స సా ||
- బం డో ళ్ల | గు రు వు | ల య్యా ||

, , రి రి స | ని ని ని | స రి రి స రి గ |
నీ వే డ | కు లి కి | త యో - - - |

, , గ గా రి | రి రి స | స సా ||
బం డో ళ్ల | గు రు వు | ల య్యా ||

2) బండెనక బండిమీద
పదహారు బళ్లమీద
పడుసూల పలుకులాట
పలుకూల పలువరుస

నీవేడ ఆగితయో
బండోళ్ల గురువులయ్యా

నీవేడ నిలిచితయో
బండోళ్ల గురువులయ్యా

3) బండెనక బళ్లదారి
బళ్లెళ్లే మళ్లదారి
దారెంతో దూరమల్లె
బారమయెర రాదారి

నీవేడ కునికెదవో
బండోళ్ల గురువులయ్యా
నీవేడ ఒరిగితయో
బండోళ్ల గురువులయ్యా

4) నడిరేయి నిద్దరేయి
సడిలేను ఎడ్లగంట
సుక్కల్లో సెంద్రుడేడీ
సోలింది మిన్నేరు

నీలేడ పలుకుదువో
బండోళ్ల గురువులయా
నీలేడ కులుకుదువో
బండోళ్ల గురువులయా

5) దారెంట బళ్లొరసా
ఏరుదాటె ఒళ్లొరసా
ఊరేళ్లే బళ్లొరసా
పదహారు బళ్లొరసా

## 44

బళ్లారసలో ప బండీ

నీకళ్ల నిండింది

నీవేడ ఉంటివయో

బండోళ్ల గురువులయా

నీవేడ జంటవయా

బండోళ్ల గురువులయా ॥

సేకరణ- 1938లో

